# అథ షష్ఠో %ధ్యాయః

# పాప భేద వర్ణనము

సనత్కుమార ఉవాచ |

ద్విజద్రవ్యాపహరణమపి దాయవ్యతిక్రమః | అతిమానో%తికోపశ్చ దాంభికత్వం కృతఘ్నతా || 1

అత్యంతవిషయాసక్తిః కార్పణ్యం సాధుమత్సరమ్ | పరదారాభిగమనం సాధుకన్యాను దూషణమ్ || 2

పరివిత్తిః పరివేత్తా చ యయా చ పరివిద్యతే | తయోర్దానం చ కన్యాయాస్తయోరేవ చ యాజనమ్ || 3

శివాశ్రమతరూణాం చ పుష్పారామవినాశనమ్ | యః పీడామాశ్రమస్థానామాచరేదల్పికామపి || 4

సభృత్యపరివారస్య పశుధాన్యధనస్య చ | కుప్యధాన్యపశుస్తేయమపాం వ్యాపావనం తథా || 5

యజ్ఞారామతడాగానాం దారాపత్యస్య విక్రయమ్ | తీర్థయాత్రోపవాసానాం వ్రతోపనయకర్మిణామ్ || 6

స్త్రీధనాన్యుపజీవంతి స్త్రీభిరత్యంతనిర్జితాః | అరక్షణం చ నారీణాం మాయయా స్త్రీనిషేవణమ్ || 7

కాలాగతాప్రదానం చ ధాన్యవృష్ట్యుపసేవనమ్ | నిందితాచ్చ ధనాదానం పణ్యానాం కూటజీవనమ్ || 8

విషమారణ్యపత్రాణాం సతతం వృషవాహనమ్ | ఉచ్చాటనాభిచారం చ ధాన్యాదానం భిషక్క్రియా || 9

జిహ్వాకామోపభోగార్థం యస్యారంభస్సుకర్మసు | మూలేనాధ్యాపకో నిత్యం వేదజ్ఞానాదికంచ యత్ || 10

బ్రాహ్మాదివ్రతసంత్యాగశ్చాన్యాచారనిషేవణమ్ |
అసచ్ఛాస్త్రాధిగమనం శుష్కతర్కావలంబనమ్ || 11

దేవాగ్నిగురుసాధూనాం నిందయా బ్రాహ్మణస్య చ | ప్రత్యక్షం
వాపరోక్షం వా రాజ్ఞాం మండలినామపి || 12

ఉత్సన్నపితృదేవేజ్యాస్స్వకర్మత్యాగినశ్చ యే | దుశ్శీలా నాస్తికాః
పాపాస్సదా వా%సత్యవాదినః || 13

పర్వకాలే దివా వాప్సు వియోనౌ పశుయోనిషు | రజస్వలాయా
యోనౌ చ మైథునం యస్సమాచరేత్ || 14

స్త్రీ పుత్రమిత్రసంప్రాప్తే ఆశాచ్ఛేదకరాశ్చ యే |
జనస్యాప్రియవక్తారః క్రూరాస్సమయవేధినః || 15

భేత్తా తడాగకూపానాం సంక్రయాణాం రసస్య చ | ఏకపంక్తిస్థితానాం
చ పాకభేదం కోతి యః || 16

ఇత్యతః స్త్రీనరాః పాపైరుపపాతకినః స్మృతాః | యుక్తా
ఏభిస్తథాన్యే%పి శృణు తాంస్తు బ్రవీమి తే || 17

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

బ్రాహ్మణుల సొత్తును అపహరించుట, పిత్రార్జితమును పంచుటలో మోసమును చేయుట, తన గొప్పదనమందు అధకమగు అభిమానమును కలిగియుండుట, తీవ్రమగు కోపము, తాను ధర్మాత్ముడునని పదిమందికి తెలియునట్లు చేయుట, చేసిన మేలును మరచుట (1), ఇంద్రియభోగములయందు అధికమగు ఆసక్తి, పసినారి ధనము, సత్పురుషులయందు అసూయ, పరస్త్రీతో సంబంధమును పెట్టుకొనుట, సత్కులమునకు చెందిన కన్యను చెడగొట్టుట (2), అన్నగారి వివాహము కాకుండగనే తమ్ముడు వివాహమాడుట, అట్టి అన్నదమ్ములకు కన్యలనిచ్చుట, వారిచే యజ్ఞమును చేయించుట (3), శివుని ఆశ్రమమును చెట్లను పుష్పోద్యానములను నాశనము చేయుట, ఆశ్రమమునందు ఉన్నవారికి అల్పముగనైననూ పీడను కలిగించుట (4),

సేవకులతో మరియు కుటుంబముతో కూడియున్నవాని పశువులను, ధాన్యమును మరియు ధనమును అపహరించుట, లోహములను, ధాన్యమును మరియు పశువులను అపహరించుట, జలములను కలుషితము చేయుట (5), యజ్ఞస్థలమును, చెరువును, భార్యను, సంతానమును విక్రయించుట, తీర్థయాత్రలను, ఉపవాసములను, వ్రతములను మరియు ఉపనయనకర్మను ధనసంపాదనకు వాడుకొనుట (6), స్త్రీ ధనముతో జీవించుట, స్త్రీలకు పూర్తిగా వశ##మై యుండుట, స్త్రీకి రక్షణను కల్పించకుండుట, మోసగించి స్త్రీని భోగించుట (7), తీసుకున్న అప్పును సమయము వచ్చిననూ తీర్చకుండుట, ధాన్యమును దుర్వినియోగము చేయుట, దుష్టుని నుండి ధనమును తీసుకొనుట, మోసముతో వ్యాపారమును చేసి జీవించుట (8), సరియగు దారి లేని అడవి దారులగుండా ఎద్దులచే బరువులను మోయించుట, భూతోచ్చాటనము, అభిచారికర్మ, ధన్యామును అపహరించుట, మోసముతో కూడిన వైద్యమును చేయుట (9), రుచ్యములగు పదార్థమును తినాలనే కోరికతో మంచి పరులనారంభించుట, నిత్యము ధనమును సంపాదించుట కొరకై వేదమును మరియు ఇతర జ్ఞానమును ఇతరులకు బోధించుట (10), బ్రహ్మచర్యము మొదలగు వ్రతములనువిడిచి పెట్టుట, పరధర్మమును స్వీకరించుట, దుష్టశాస్త్రములనధ్యయనము చేయుట, శాస్త్రవిరుద్ధమగు తర్కమునవలంబించుట (11), దేవతలు, అగ్ని, గురువు, సాధువు, బ్రాహ్మణుడు, రాజు మరియు మండలాధిపతి అను వారిని ప్రత్యక్షముగా గాని, పరోక్షములో గాని నిందించుట (12), పితృక్రియలను, దేవతలకొరకు చేసే యజ్ఞములను పరిత్యజించుట, స్వకర్మను అనుష్ఠించ కుండుట, చెడు స్వభావమును కలిగి యుండుట, నాస్తికవాదమునవలంబించుట, సర్వదా పాపకార్యములను చేయుచుండుట, అసత్యమునుపలుకుట (13), పర్వదినములలో గాని, పగలు గాని, నీటిలో గాని సంభోగము, పరస్త్రీ రతి, పశుసంభోగము, రజస్వలాసంభోగము (14), తన వద్దకు వచ్చిన స్త్రీకి, పుత్రునకు మరియు మిత్రునకు ఆశాభంగమును కలిగించుట, జనులకు అప్రియమగు విషయములను చెప్పుట, క్రూరబుద్ధిని

కలిగియుండుట, మాటను నిలబెట్టు కొనక పోవుట (15), చెరువులను, నూతులను, మరియు నీటిని చేలకు అందించే కాలువలను వినాశము చేయుట, ఒకే పంక్తియందు ఉన్న వారికి ఆహారము నిచ్చే సమయములో పంక్తిభేదమును చేయుట (16), అను పాపములను చేయు స్త్రీ పురుషులు ఉపపాతకులు అనబడుదురు. ఇంకనూ మరికొందరు పాపాత్ములను గురించి చెప్పెదను ; వినుము (17)

యే గోబ్రాహ్మణకన్యానాం స్వామిమిత్రతపస్వినామ్ | వినాశయంతి కార్యాణితే నరా నారకాః స్మృతాః || 18

పరస్త్రీయాభితప్యంతే యే పరద్రవ్యసూచకాః పరద్రవ్యహరా నిత్యం తౌలమిథ్యానుసారకాః || 19

ద్విజదుఃఖకరా యే చ ప్రహారం చోద్ధరంతి యే |సేవంతే తు ద్విజాశ్శూద్రాం సురాం బధ్నంతి కామతః || 20

యే పాపనిరతాః క్రూరా యే%పి హింసాప్రియా నరాః | వృత్త్యర్థం యే%పి కుర్వంతి దానయజ్ఞాదికాః క్రియాః || 21

గోష్ఠాగ్నిజలరథ్యాసు తరుచ్ఛాయానగేషు చ | త్యజంతి యే పురీషాద్యాన్నా రామాయతనేషు చ || 22

లజ్జాశ్రమప్రాసాదేషు మద్యపానరతాశ్చ యే | కృతకేలిభుజంగాశ్చ రంధ్రాన్వేషణతత్పరాః || 23

వంశేష్టకాశిలాకాష్ఠేః శృంగైశ్శంకుభిరేవ చ | యే మార్గమనురుంధంతి పరసీమాం హరంతి యే || 24

కూటశాసనకర్తారః కూట కర్మక్రియారతాః | కూటపాకాన్నవస్త్రాణాం కూటసంవ్యవహారిణః || 25

ధనుషశ్శస్త్రశల్యానాం కర్తా యః క్రయవిక్రయీ | నిర్దయో%తీవ భృత్యేషు పశూనాం దమనశ్చ యః || 26

మిథ్యా ప్రవదతో వాచ ఆకర్ణయతి యశ్శనైః |స్వామిమిత్రగురుద్రోహీ మయావీ చపలశ్శఠః || 27

యే భార్యాపుత్రమిత్రాణి బాలవృద్ధకృశాతురాన్ |
భృత్యానతిథిబంధూంశ్చ త్యక్త్వాశ్నంతి బుభుక్షితాన్ || 28

యస్స్వయం మిష్టమశ్నాతి విప్రేభ్యో న ప్రయచ్ఛతి | వృథాపాకస్స విజ్ఞేయో బ్రహ్మవాదిషు గర్హితః || 29

ఎవరైతే గోవులు, బ్రాహ్మణులు, కన్యలు, రాజు, మిత్రులు, తపశ్శాలురు అను వారి కార్యములను చెడగొట్టెదరో, వారు పాపాత్ములని చెప్పబడుదురు (18), పరస్త్రీవ్యామోహముచే తపమును పొందువారు, పరధనముపై కన్నువేసి ఉంచువారు, పరధనమును అపహరించువారు, తూకములో మోసమును చేయువారు (19), బ్రాహ్మణులకు దుఃఖమును కలిగించువారు, వారిని కొట్టుటకై ఆయుధమును పైకి ఎత్తువారు, శూద్రులను సేవించు బ్రాహ్మణులు, కామనచే మదిరను సేవించువారు (20), పాపమునందాసక్తి గల క్రూరాత్ములు, హింసయందు ప్రీతి గల మానవులు, దానము, యజ్ఞము మొదలగు కర్మలను జీవికకొరకై చేయువారు (21), గోశాల, అగ్ని, నీరు, నడచే దారి, చెట్టునీడ, పర్వతము, ధర్మశాల, దేవాలయము అను ప్రదేశములయందు పురీషాదులను విసర్జించువారు (22), సిగ్గును విడచి ఆశ్రమములో మరియు ప్రధానమగు ప్రాసాదములలో మద్యమును సేవించుటయందు ఆసక్తిని కలిగి యుండువారు, జూదమునాడువారు, విటులు, ఇతరులయందలి దోషములను వెదకుటయే ప్రముఖకార్యముగా గలవారు (23), వెదురుబొంగులు, ఇటుకలు, రాళ్లు, కర్రలు, పశువుల కొమ్ములు, మేకులు అను వాటితో దారిని మూసివేయువారు, ఇతరుల సరిహద్దును అతిక్రమించువారు (24), మోసముతో కూడిన చట్టములను చేయువారు, మోసముతో కూడిన కార్యములయందు ఆసక్తి గలవారు, ఇతరులనుమోసగించి తెచ్చిన అన్నమును, ఇతరభక్ష్యములను మరియు వస్త్రములను మోసముతో ఉపమోగములో పెట్టువారు (25), ధనస్సు, బాణము, మరియు

ఇతరములగు ఆయుధములను తయారుచేసి క్రయవిక్రయములను చేయువారు, సేవకులయందు లేశ##మైననూ దయలేనివారు, పశువులను హింసించువారు (26), వ్యర్థమగు వచనములను పలుకువాడు, ఇతరుల మాటలను మెల్లగా వినువాడు, రాజునకు, మిత్రునకు మరియు గురువునకు ద్రోహమును చేయువాడు, మోసములను చేయువాడు, చంచలస్వభావము గల వాడు, నమ్మించి మోసము చేయువాడు (27), భార్య, పుత్రులు, మిత్రులు, పిల్లలు, వృద్ధులు, నీరసించి యున్నవారు, ఆపదలో నున్నవారు, సేవకులు,అతిథులు, బంధువులు అను వారు ఆకలితో నుండగా వారిని విడిచిపెట్టి భుజించువారు పాపాత్ములనబడుదురు (28), బ్రాహ్మణులకు సమర్పించకుండగా స్వయముగా మృష్టాన్నమును తినువారు చేసుకొనే వంట వ్యర్థమనియు, వారు నిందార్హులనియు వేదవేత్తలు చెప్పుచున్నారు (29).

నియమాన్ స్వయమాదాయ యే త్యజంత్యజితేంద్రియా ః
ప్రవ్రజ్యావాసితా యే చ హరస్యాస్య ప్రభేదకాః || 30

యే తాడయంతి గాం క్రూరా దయమంతే ముహుర్ముహుః |
దుర్బలాన్యే న పుష్ణంతి సతతం యే త్యజంతి చ || 31

పీడయంత్యతిభారేణా%సహంతం వాహయంతి చ |
యోజయన్నకృతాహారాన్న విముంచంతి సంయతాన్ || 32

యే భారక్షతరోగార్తాన్ గోవృషాంశ్చ క్షుధాతురాన్ | న పాలయంతి యత్నేన గోఘ్నాస్తే నారకాఃస్మృతాః || 33

వృషాణాం వృషణాన్యే చ పాపిష్ఠా గాలయంతి చ | వాహయంతి చ గాం వంధ్యాం మహానరకినో నరాః || 34

ఆశయా సమనుప్రాప్తాన్ క్షుత్తృష్ణాశ్రమకర్శితాన్ | అతిథీంశ్చ తథా%నాథాన్ స్వతంత్రాన్ గృహమాగతాన్ || 35

అన్నాభిలాషాన్ దీనాన్వా బాలవృద్ధకృశాతురాన్ | నానుకంపంతి యే మూఢాస్తే యాంతి నరకార్ణవమ్ || 36

ఎవరైతే ఇంద్రియజయము లేనివారై తాము స్వయముగా చేపట్టిన వ్రతనియమములను విడిచి పెట్టెదరో, సన్న్యసించి మరల గృహస్థాశ్రమములోనికి తిరిగి వచ్చెదరో, శివుని మూర్తులను భగ్నము చేసెదరో (30), ఏ క్రూరాత్ములు ఎద్దును పలుమార్లు కొట్టి పీడించెదరో, బక్క చిక్కిన ఎద్దులను పోషించకుండగా విడిచిపెట్టెదరో (31), సహించ శక్యము కాని అధికభారమును బళ్లకు కట్టి వాటిచే మోయించెదరో, వాటిని విశ్రాంతి కొరకై విడిచిపెట్టరో, వాటికి ఆహారమునీయరో (32), బరువులను మోసే సమయములో గాయపడిన ఎద్దులను, రోగమును పొందిన ఎద్దులను మరియు ఆవులను, అవి ఆకలితోబాధపడుచుండగా వాటికి ప్రపయత్నపూర్వకముగా ఆహారమును ఇచ్చి పోషించరో, అట్టి వారు గోహత్యాపాపమును పొందెదరని మహర్షులు చెప్పుచున్నారు (33), ఏ పాపాత్ములు వృషభముల అండములను బలాత్కారముగా తీసివేసి వాటిచే బరువులను మోయించెదరో, పాలీయని ఆవులచే బరువులను మోయించెదరో, వారు మహాపాపాత్ములు (34), ఆశ పడి వచ్చిన వారిని, ఆకలి దప్పికలతోమరియు శ్రమ చేసి చిక్కి యున్నవారిని, అతిథులను, అనాథులను, స్వతంత్రముగా ఇంటికి వచ్చిన అభ్యాగతులను, అన్నమును కోరే దీనులను, పిల్లలను ముసలి వారిని, కృశించి దుఃఖించుచున్న వారిని ఏ మూర్ఖులైతో దయతో పాలించరో, వారు నరకసముద్రములో పడెదరు (35, 36).

గృహేష్వర్థా నివర్తంతే స్మశానాదపి బాంధవాః | సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంతమనుగచ్ఛతి || 37

అజావికో మాహిషికస్సాముద్రో వృషలీపతిః | శూద్రవత్ క్షత్రవృత్తిశ్చ నారకీ స్యాద్ ద్విజాధమః || 38

శిల్పినః రారవో వైద్యా హేమకారా నృపధ్వజాః | భృతకాః కూటసంయుక్తాస్సర్వే తే నారకాః స్మృతాః || 39

యశ్చోచితమతిక్రమ్య స్వేచ్ఛయైవాహరేత్కరమ్ | నరకే పచ్యతే సో%పి యో%పి దండరుచిర్నరః || 40

ఉత్కోచకై రుచిక్రీత్రైస్తస్కరైశ్చ ప్రపీడ్యతే | యస్య రాజ్ఞః ప్రజా రాష్ట్రే పచ్యతే నరకేషు సః || 41

యే ద్విజాః పరిగృహ్ణంతి నృపస్యాన్యాయవర్తినః | తే ప్రయాంతి తు ఘోరేషు నరకేషు న సంశయః || 42

అన్యాయాత్సముపాదాయ ద్విజేభ్యో యః ప్రయచ్ఛతి | ప్రజాభ్యః పచ్యతే సో%పి నరకేషు నృపో యథా || 43

పారదారికచౌరాణాం చండానాం విద్యతే త్వఘమ్ | పరదారరతస్యాపి రాజ్ఞో భవతి నిత్యశః || 44

అచౌరం చౌరవత్పశ్యేచ్చౌరం వా%చౌరరూపిణమ్ | అవిచార్య నృపస్తస్మాద్ఘాతయన్నరకం వ్రజేత్ || 45

వ్యక్తి మరణించినప్పుడు సంపదలు ఇంటి వద్దనే ఆగి పోవును. బంధువులు స్మశానము నుండి వెనుకకు మరలెదరు. పరలోకప్రయాణములోఅతడు చేసిన ధర్మాధర్మములు మాత్రమే తోడుగా వచ్చును (37). మేకలను పెంచువాడు, బర్రెలను పాలించువాడు, చేపలు పట్టి జీవించువాడు, శూద్రస్త్రీని వివాహమాడినవాడు, క్షత్రియ ధర్మమును పాటించువాడు అగు బ్రాహ్మణాధముడు శూద్రునివంటి వాడై నరకమును పొందును (38). మోసమును చేయు శిల్పకారులు, కమ్మరులు, వైద్యులు, కంసాలులు, రాజపురుషులు, నటించువారు, రాజసేవకులు అనే వీరు అందరు నరకమును పొందెదరు (39). ప్రజలను శిక్షించుటయందు అభిరుచి కలిగి ఔచిత్యమును ప్రక్కన బెట్టి యథేచ్ఛగా పన్నులను వసూలు చేయు రాజు కూడ నరకములో మ్రగ్గి పోవును (40). ఏ రాజుయొక్క రాష్ట్రములో ప్రజలు లంచగొండితనము, బంధుప్రీతి మరియు చోరబాధల వలన పీడించబడుదురో, ఆ రాజు నరకములలోమ్రగ్గును (41). అన్యాయమార్గములోనున్న రాజు యొక్క ధనమును స్వీకరించే బ్రాహ్మణులు నిస్సందేహముగా ఘోరమగు నరకములను పొందెదరు (42). బ్రాహ్మణుల సంపదను అన్యాయముగా అపహరించి దానిని ఇతరులకు పంచి పెట్టు రాజు కూడ

నరకములో తపింప చేయబడును (43). పరభార్యారతులకు, చోరులకు, క్రూరులకు మరియు నిత్యము పరస్త్రీలయందు వ్యామోహము గల రాజునకు పాపము చుట్టుకొనును (44). చోరుని మంచివాడుగా తలంచు రాజు, చోరుడు కాని వానిని చోరుడని తలంచి శిక్షించే రాజు నరకమును పొందును. (45).

ఘృతతైలాన్నపానాని మధుమాంససురాసవమ్ | గుదేక్షుశాకదుగ్ధాని దధిమూలఫలాని చ || 46

తృణం కాష్ఠం పత్రపుష్పమౌషధం చాత్మ భోజనమ్ |ఉపానచ్ఛత్రశకటమాసనం చ కమండలుమ్ || 47

తామ్రసీసత్రపుశ్శస్త్రం శంఖాద్యం చ జలోద్భవమ్ | వైద్యం చవైణవం చాన్యద్గృహోపస్కరణాని చ || 48

ఔర్ణకార్పాసకౌశేయపట్టసూత్రోద్భవాని చ | స్థూలసూక్ష్మాణి వస్త్రాణి యే లోభాద్ధి హరంతి చ || 49

ఏవమాదీని చాన్యాని ద్రవ్యాణి వివిధాని చ | నరకేషు ధ్రువం యాంతి చాపహృత్యాల్పకాని చ|| 50

తద్వా యద్వా పరద్రవ్యమపి సర్షపమాత్రకమ్ | అపహృత్య నరా యాంతి నరకం నాత్ర సంశయః || 51

ఏవమాద్యైర్నరః పాపైరుత్ర్కాంతిసమనంతరమ్ | శరీరయాతనార్థాయ సర్వాకారమవాప్నుయాత్ || 52

యమలోకం వ్రజంత్యేతే శరీరేణ యమాజ్ఞయా | యమదూతైర్మహాఘోరైర్నీ యమానాస్సుదుఃఖితాః || 53

దేవితిర్యఙ్మనుష్యాణామధర్మనిరతాత్మనామ్ | ధర్మరాజః స్మృతశ్శాస్తా సుఘోరైర్వివిధైర్వధైః || 54

నియమాచారయుక్తానాం ప్రమాదాత్ స్ఖలితాత్మనామ్ | ప్రాయశ్చిత్తైర్గురుశ్శాస్తా న బుధైరిష్యతే యమః || 55

పారదారికచౌరాణామన్యాయవ్యవహారిణామ్ |నృపతిశ్శాసకః ప్రోక్తః ప్రచ్ఛన్నానాం స ధర్మరాట్ || 56

తస్మాత్కృతస్య పాపస్య ప్రాయశ్చిత్తం సమాచరేత్ | నాభుక్తస్యాన్యథా నాశః కల్పకోటిశ##తైరపి || 57

యః కరోతి స్వయం కర్మ కారయేచ్చానుమోదయేత్ | కాయేన మనసా వాచా తస్య పాపగతిః ఫలమ్ || 58

ఇతి శ్రీశివమహాపురాణె ఉమాసంహితాయం పాపభేదవర్ణనం నామ షష్ఠో%ధ్యాయః (6).

నేయి, నూనె, అన్నము, పానము, తేనె, మాంసము, సారా, కల్లు, బెల్లము, చెరుకు, కూరలు, పాలు, పెరుగు, దుంపలు, పళ్లు (46), గడ్డి, కట్టెలు, ఆకులు, పుష్పములు, ముందు, స్వీయభోజనము, చెప్పులు, గొడుగు, బండి, ఆసనము, కమండలము (47), రాగి, సీసము, తగరము, ఆయుధము, నీటిలో పుట్టే శంఖము మొదలైన వస్తువు, మందు కషాయములు, వెదురు, ఇతరములగు ఇంటి పనిముట్లు (48), ప్రత్తి, సిల్కు మరియు పట్టులతోనేసిన ముతక మరియు నాజూకు వస్త్రములు అను పదార్థములను ఎవరైతే లోభముచే అపహరించెదరో (49), ఎవరైతే ఇటువంటి వివిధద్రవ్యములను అల్పపరిమాణములో నైననూ అపహరించెదరో, వారు నరకములను పొందుట నిశ్చయము (50), పరద్రవ్యమేదైననూ ఆవగింజంత కూడ అపహరించిన మానవులు నరకమును పొందెదరు. దీనిలో సందేహము లేదు (51), ఇటువంటి పాపములను చేసినమానవుడు మరణించిన పిదప యాతనలను అనుభవించుట కొరకై అనేకదేహములను ధరించును (52), వీరు ఒక శరీరమును దాల్చి మహాభయంకరులగు యమదూతలు యముని ఆజ్ఞచే గొనిపోవుచుండగా మహాదుఃఖమును పొందుచూ యమలోకమునకు వెళ్లెదరు (53), అధర్మమునందు లగ్నమైన అంతఃకరణములు గల దేవతలు, పశుపక్ష్యాదులు మరియు మానవులు అను ప్రాణులను యమధర్మరాజు మిక్కిలి ఘోరమైన వివిధములగు యాతనలకు గురి చేసి శిక్షించునని చెప్పబడినది (54), నిత్యము ఆచారమును

పాటించుచూ పొరపాటుచే తప్పును ఒనరించిన వారికి గురువు ప్రాయశ్చిత్తమును చేయించిన సరిపడును. వారిని యముడు శక్షించడని పండితులు చెప్పినారు (55), పరభార్యారతులను, చోరులకు, అన్యాయముతో కూడిన వ్యవహారము గలవారిని శిక్షించును. వారు తప్పు బయట పడకుండగా దాచినచో, వారిని యముడు శిక్షించును (56). కావున, చేసిన పాపమును ప్రాయశ్చిత్తముచే తొలగించుకొనవలెను. ఫలమును అనుభవించకుండగా చేసిన పాపము కోటి కల్పములు గడచినా నశించదు (57), ఎవడైతే తాను స్వయముగా తప్పు పనిని శరీరముచే గాని వాక్కుతో గాని లేదా మనస్సుతో గాని చేయునో, లేదా చేయించునో, మరియు ప్రోత్సహించునో, వానికి నరకమనే ఫలము లభించును (58).

శ్రీ మహాపురాణములో ఉమాసంహితయందు పాపభేదవర్ణనము అనే ఆరవ అధ్యాయము ముగిసినది.